# ఫ్లొరెన్సు నైటింగేలు

మనలో చాలమంది తమ జీవితాలను దారంతెగినగాలిపటాలుగా చుక్కానిలేని నావలుగా వదిలేసి ఎటుగాలిస్తే అటు పోతుంటారు. వారికొక గమ్యంలేదు. మార్గంలేదు. అలా కాకుండా జీవితానికొక లక్ష్యాన్ని మార్గానిన నిర్ణయించుకొని ఎటువంటి ప్రతికూల పరిస్థితులనయినా ఎదుర్కొని తమ ఆశయాలను సాధించినవారే చరిత్రలో గొప్పవ్యక్తులుగా నిలచిపోతారు, అలాంటివారిలో ఫ్లొరెన్స్ నైటింగేలు ఒకరు. హమిశాలోకానికి కాదు సర్వమనావాళికే మణిపూస ఆమె. సేవ అను పదానికి ప్రత్యక్ష నిదర్శనం ఆమె జీవితం.

1820వ సంవత్సరములో ఇటలీదేశపు పర్వతప్రాంతములలోని ఒక సంపన్నుల ఇంట జన్మించింది. వారి కుటుంబం సంస్కారవంతుల నిలయం. ఫ్లొరెన్స్ మొదటినుంచి తెలివైన అమ్మాయి. ఆమె చురుకైనది కూడా కావడమువల్ల ఎక్కువగామాట్లాడుతుండేది.

ప్రకృతిని పరిశీలిస్తూ తిరగడము ఆమెకు సరదా. గుర్రలను కుక్కలనుమచ్చిక చేసుకొని వాటిని పెంచేది. ఆడంబర జీవితము ఆమకు నచ్చదు. వారి కుటుంబము ఇంగ్లాండుకు వలస వచ్చింది.

పెళ్ళిళ్ళు చేసుకొని కాపురాలు చేయడము, పిల్లల్ని కని, పెంచము, మాత్రమే ఆ కాలపు ఆడవారి పనులుగా వుండేవి, కాకపోతే అల్లికలు, కుట్లు వంటి అభిరుచులను మోదించే వాళ్ళు.

ఆ రోజుల్లో ఆడపిల్లలనుబడికి పంపటము అరుదు. ధనవంతులు మాత్రము వాళ్ళ పిల్లలను ఇంటివద్దనే చదువు చెప్పించుకునేవాళ్ళు. వాళ్ళ ఆడపిల్లలు ఒంటరిగా బయటకు పోగూడదు. గుర్రపు బండిలో కూడా ఒక మగవాడు అంగరక్షకుడిగా అనుసరించాలి.

తండ్రి ఆమెకు ఇటాలియన్, గ్రీకు, లాటిన్ భాషలునేర్పాడు. కొన్ని తత్త్వశాస్త్ర గ్రంథాలను ఆమెచేత చదివించాడు. గణితముపట్ల ఆమెకు ఆసక్తి ఎక్కువ.

సేవాభావాలు ఆమెలో చిన్నప్పటినుంచే వున్నాయి. ఆపదలో ఉన్న వాళ్ళను ఆదుకోవాలని ఆరాటపడేది. ఇరుగు పొరుగు ఎవ్వరు అనారోగ్యముగా వున్నా ఆమె వెళ్ళి పరిచర్య చేయాలని ప్రయతించేది. పసిపాపలను పంచప్రాణాలుగా చూసుకుంటూ వాళ్ళను ఆడించి లాలించేది. తన అక్క అడుకొని నిర్లక్ష్యముగా పారవేసిన బొమ్మలను బాగుచేసేది.

నర్సింగు నేర్చుకోవాలని ఆమెకు కోరిక. కాని వారిది ధనికుల కుటుంబము కనుక వాళ్ళ అమ్మాయి తక్కువ పనులు చేయడానికి అటువంటిచదువులు చదవడానాకి పెద్దలు ఇష్టపడరు. ఒకసారి ప్రమాదములో గాయపడిన కుక్కపిల్లకుపరిచర్యలు చేసి బ్రతికించింది. అలాంటి పనులు చేయడము నచ్చని అమ్మతో తరచు ఘర్షణపడేది ఫ్లారెన్స్. ఏ పనిచేయకుండా ఎప్పుడూ ఇంట్లోనే ఊరక కూర్చోమంటే ఆమెకు విసుగుపుట్టేది.

యుక్తవయస్సు వచ్చేసరికి ఫ్లారెన్స్, సన్నగా,పొడవుగా మృదువైన కంఠస్వరము, చురుకైన చూపులతో అందముగా, అకర్షణీయముగా ఉంది. 1837లో ఒకనాడు భగవంతుడు తనసేవకై నన్నుపిలుస్తున్నాడు'' అని డైరీలో వ్రాసుకుంది. ''నా ఊహాలన్నీ ఈ లోకంలోని బాధలు, విషాదాలతోనే నిండివుంటాయి. కాని నా సేవాభావాలు మా పెద్దలు నచ్చవు. బాధలతో మ్రగ్గిపోతున్న మానవులకు సాయపడకుండా జీవించడము మణముతో సమానము'' అనుకునేది తరచు. ఎప్పటికైనా తన ఆశలు ఫలించకపోతాయా అనే ఆశతో పంజరములో పక్షిలా రోజులు వెళ్ళబుచ్చింది.

ఫ్లారెన్స్ ఆలోచనలంటేనే వాళ్ళ అమ్మకు అసహ్యం, అందుకని తరచు చికాకా,కొపముగా చిర్రుబుర్రులాడుతుండేది. నాన్న కాస్తనయం. తనయ బ్రతిమలాడితే తనతో బాటు ఎప్పుడైనా సభలకు, సమావేశాలకు తీసుకువెళ్ళేవాడు.

తరువాత బంధువుల ఊరికి వెళ్ళి కొన్నాళ్ళుఅక్కడ వున్నది. అప్పుడు అక్కడిశ్రమజీవుల కష్టాలను, వారి జీవనవిధానాలను బాగా పరిశీలించే అవకాశము కుదిరింది. ఆ అనుభవాలు ఆమెకు తరువాతకాలములో బాగా ఉపయోగపడ్డాయి.

అమ్మాయి ఆలోచనలలో ఏమీ మార్పు రాకపోవడంతోఆమె దృష్టిని మరల్చడానికై స్నేహితురాండ్రతో కలసి ఇటలీ పర్యటనకు అనుమతించారు తల్లిదండ్రులు. దీనితో రోమ్, గ్రీసు, మరొకొన్ని ప్రాంతాలను సందర్శించి, పలువురు ప్రముఖవ్యక్తులను కలుసుకునే అవకాశము ఆమెకు దొరికింది. దాన, దయాగుణాలున్న ఒక ధనవంతునితో పరిచయం అయింది.

తిరుగు ప్రయాణములో జర్మని వెళ్లింది. కైజర్వర్త్ అనే అనాథ బాలల శరణాలయాన్ని, ఆసుపత్రిని చూసింది, అందులో స్త్రీలు, క్రైస్తవ సన్యాసినులు సేవలు చేయడము కన్నులారా చూసింది కొన్ని రోజులు అక్కడేవుంది. పరిశుభ్రతకు వారు ఇస్తున్న ప్రాధాన్యతను గమనించింది. సేవలు చేసే వారిలో తృప్తి, అందుకనేవారిలో అనందాన్ని గ్రహించింది ఇంగ్లండులో అందుకు విరుద్ధముగావున్న ఆసుప్రతులను, రోగులను గుర్తుతెచ్చుకున్నది. వాటిని ఎంతో మెరుగుపరచాలి. ఆమె ఇంతకాలమూ చూడాలని కలలుగన్న ఆదర్శ ఆసుపత్రి అదేననిపించింది. అమెలో సేవాభావాలు మరింత స్పష్టముగా రూపుదిద్దుకున్నాయి. ఇంటికి తిరిగివచ్చింది. తన కోరికలను వెలువరించింది.

ఆమె దృష్టి మరలుతుందేమోనని ఆశించిన పెద్దలకు నిరాశే మిగిలింది. వారుబాధపడ్డారు. వ్యధచెందారు. పెద్దలతో పోట్లాడైన సరే తన లక్ష్యాన్ని సాధించాలనితీర్మానించుకుంది ఫ్లారెన్స్. ఒక ధనికుడు ఆమెను ఏకపక్షముగా ప్రేమించి పెళ్ళిచేసుకోవడానికి సిద్ధముగా వున్నాడు. కాని ప్రేమలూ, పెళ్ళిళ్ళు ఆమెకు ఇష్టములేవు. అనిన విధాలా సుఖప్రదమైన జీవితము అటు ఆహ్వానిస్తుంటే దాన్ని కాదని కష్టాలను అలవాటమైన ముళ్ళబాటలో పయనించటారనికి నిశ్చయించుకున్నదామె.

1850 నాటికి ఆమెకు 30 సంవత్సరాలు వచ్చాయి. ఆ మరుసటి ఏడు వాళ్ళ సోదరికి జబ్బు చేస్తే ఆసుపత్రిలో చేర్చారు. ఫ్లారెన్స్ కూడా వెంట వెళ్ళింది. తరువాత జర్మనీ వెళ్ళి ఇంతకు ముందు తాను చూసివచ్చిన శరణాలయములో నర్సుగా రెండు వారాల పాటు శిక్షణ పొందింది. అదే ఆమె స్వేక్షావాయువులు పీల్చుకున్న మొదటి సంవత్సరము;

అప్పట్లో పూర్తి శిక్షణ పొందిన నర్సులు ఎక్కువగా లేరు. కొందరు తమ తల్లుల ద్వారా నర్సింగు నేర్చుకొని వంశపారంపర్యాం ఆ వృత్తి చేస్తూండేవాళ్ళు. అప్పుడు జ్వరం కొలవడానికి థర్మామీటర్లు కూడా లేవు. చేయిపట్టుకొని చూసి సుమారుగా వేడి తలుసుకొనేవాళ్ళు, బహుకొద్దిమంది సుశిక్షితులయిన నర్సులు చాలా పెద్ద తసుపత్రులలో మాత్రమే ఉండేవాళ్ళు. వాళ్ళు కూడా వళ్లువంచి పనిచేయని తాగుబోతులు.

ఫ్లారెన్స్ కు తడపరపోసి బాగా నీరసపడింది. కొంత కాలం లండన్ లో విశ్రాంతి తీసుకున్నది. అయినా దృష్టిని మాత్రం తన మార్గం నుండి మరల్చలేదు. అమ్మాయి ఆలోచనల అంతర్యమెరిగిన తండ్రి ఏటా 500 పౌండ్లు ఇవ్వడానికి అంగీకరించాడు, దాంతో స్వంత ఆసుపత్రి నిర్వహించాలని ఆమె కోరిక.

ఇంగ్లాండులో పిల్లలను పెంచడానికి, ఇళ్ళలో పనులు చేయడానికి ఆయాలవంటి సేవికలుండేవాళ్ళు. వీళ్ళవి నిరుపేద కుటుంబాలు, వీళ్ళకు రోగంవస్తే చూసేవాళ్ళేలేరు, ఆ నిర్భాగ్యులకు లండన్ లో ఆసుపత్రి ప్రారంభఢించారు కొందరు పెద్దలు. అందులో ఫ్లారెన్ కు సూపరిండెంటెంట్ (నిర్వహణాధికారిగా ఉద్యోగం ఇచ్చారు. ఉద్యోగ బాధ్యతలు స్వీకరించిన మరుక్షణం నుంచి ఆమె రంగంలోకి దిగి కార్యక్రమాలు ప్రారంభించింది. యదార్థానికి ఆమె ఒక పర్యవేక్షణాధికారి మాత్రమే. ఐనా ఆమె నడుం బిగించి ముందు నిలచి పనులు చేసేది. రోగులను చూడటానికి వెళ్ళే డాక్టర్ల వెంట ఆమె కూడా వెళ్ళేది. లండన్ లో కలరా వ్యాధి ఉధృతంగా వస్తే మిడిల్ సెక్స్ ఆసుపత్రిలోని స్త్రీల వార్డులో రోగులకు ఆమె స్వయంగా పరిచర్యలు చేసింది.

తాను పనిచేసే ఆసుపత్రి నిర్వహణకు కమిటీలు, ఆవీ, ఇవీ వుండేవి. అవన్నీ సేవచేయటారనికి ఆటంకాలు అని ఆమె అనుకుంది. ఆసుపత్రిలో క్రైస్తవులలోని ఒక శాఖవారికి మాత్రమే వైద్యం చేయాలనుకున్నారు. ఆమె అందుకు వ్యతిరేకించింది. అన్ని శాఖల క్రైస్తవులకు, యూదులకు మతంతో నిమిత్తం లేకుండా మనషులెవరికైనా అందులో ప్రవేశం వుండాలని వాదించి గెలిచింది.

ఒక్క ఏడాది తిరగకముందే విస్తరణ ప్రారంభించి, దానిని నర్సుల శిక్షణా సంస్థగా రూపొందించబూనుకున్నది. ఆమె ఓర్పుకు, పని తీరుకు అచ్చెరువందిన వారు ఈమెకు అదే రంగంలో ఉన్నత పదవులను ఇస్తామని ఆహ్వానించారు.

1854 సంవత్సరములో ఇంగ్లాండుకు రష్యాతో క్రిమియా యుద్ధం వచ్చింది. మార్చి నెలలో సైనిక పటాలాలను యుద్ధరంగానికి పంపారు. సైనికులు తాను ఏర్పాట్లు చేసుకొనే వ్యవధిలేక, ప్రతికూల వాతావరణం వల్ల తీవ్రమైన బాధలను ఎదుర్కొనవలసి వచ్చింది.

రష్యాతో చలికాలంలో యుద్ధం చేయడం మాటలు కాదు. పైగా ఇంగ్లండు యుద్ధ విషయంలో ఆదమరచి వుంది. గత నలభై ఏళ్ళ నుంచి బ్రిటిష్ సైనికులు ఏ యుద్ధంలోనూ పాల్గొనలేదు. క్రొత్త వ్యూహాలు తెలియవు. ప్రభుత్వ శాఖల్లో అలసత్వం పేరుకుపోయింది. ఇవన్నీ కలసి పరిస్థితులను విషమింపచేశాయి.

అక్టోబరు నాటికి అలవికానంత అధ్వాన్నంగా మారాయి స్థితిగతులు. రహదారి సౌకర్యాలులేవు. గుర్రపు బళ్లు గూడా సరిగా నడవవు. ఆ దారులలో సామాగ్రి, మందులు ఒక చోట నుంచి మరోచోటుకు చేరవేయడానికి విశ్వప్రయత్నం చేయాలి. రోగులను నల్ల సముద్రము గుండా 300 మైళ్ళు తీసుకువెళ్ళి వైద్యం చేయాల్సి వచ్చేది.

ఫ్రెంచి సైనికులకు సిస్టర్స్ ఆఫ్ చారిటీ వారి సేవలు అందడంవల్ల వారి పని కాస్త మెరుగ్గా వుండేది. మూలిగే నక్కమీద తాటికాయ పట్టట్లు సైనికులకు కలరా సోకింది. తినడానికి తిండికూడా దొరికేదికాదు. వీటన్నిటితోపాటు

రష్యాదేశపు తుపాకిగుండ్ల ద్వారా కంటే జబ్బులవలననే ఎక్కువమంది బ్రిటిష్ సైనికులు మరణించారేమో అనిపించింది.

యుద్ధరంగంలో తమ వైఫల్యాలను, సైనికుల కష్టాలను తెలుసుకున్న బ్రిటన్ పౌరులు తల్లడిల్లిపారు. దేశం కోసం పోరాడి క్షతగాత్రులయిని సైనికులకయినా కనీస సేవలు అందించలేని దైన్యస్థితిలో వున్నందుకు ఆవేదన చెందారు. ఇంగ్లండు దేశం మొత్తం నుంచి ఒక్క నర్సుఐనా లేదా! అనుకుంటున్న ఒక అధికారికి ఫ్లారెన్స్ గుర్తు వచ్చింది. వెంటనే ఆమెను నర్సింగు సూపరింటెండెంటుగా వెళ్ళమని అభ్యర్థిస్తూ ఉత్తరం వ్రాశాడు. హృదయ విదారకమైన యుద్ధ వార్తలు విన్న నైటింగేలు తన సేవలను స్వచ్ఛందంగా అందజేయడానికి సిద్ధంగా ఉన్నానని మిలటరి అధికారులకు ఉత్తరం వ్రాసింది. ఈ రెండు ఉత్తరాలు దారిలో ఒక దానికొకటి ఎదురయ్యాయి.

ఆమెను ప్రభుత్వము తరపున పంపడానికి నిర్ణయించారు. తల్లిదండ్రులు ఆటంకము చెప్పలేదు. పత్రికలవాళ్లు రెండురోజుల్లో ఏడువేళ పౌండ్లు నిధిని పోగుచేసి ఆమెకు ఇచ్చారు. 38 మంది నర్సుల బృందాన్ని ఎంపిక చేసుకుంది. అందులో కొందరు కాథలిక్కులు, కొందరు ఆంగ్లికన్ లు, మిగతావారు ఏ శాఖకూ చెందనివారు. ప్రయాణములోనే ఆమెకు కష్టాలు ఎదురయ్యాయి. తన బృందములో ఎవరికి కావలసిన సౌకర్యాలు వాళ్ళకు నౌకలో అందించడమే కష్టమయింది.

ఆమె వెంట తీసుకువెళ్ళిన దూది, కట్టుగుడ్డలు, సబ్బులు,మందులు వంటివి సైనికులకు బాగా ఉపయోగపడ్డాయి. ఆమె తన సున్నిత హాస్యంతో కష్టాలను, ఇబ్బందులను అధిగమిస్తూ ముందుకు సాగేది. మిలటరి అధికారులు ఈ ఆడవారి నియామకాలను హర్షించలేదు అబలలు ఆ కఠిన పరిస్థితులలో అవస్థల పాలవటం తప్ప చేయగలిగిందేముందని పెదవి విరిచారు.

యుద్ధరంగానికి దగ్గరలో ఆసుపత్రిని నిర్మించే అవకాశములేదు. నల్లసముద్రతీరాన ఇసుక తిన్నెలపై రవాణా చాలాకష్టం. క్రిమియా సింధుశాల

చాలాభాగం రష్యా అధీనంములో వున్నందున పౌర జీవనానికి భద్రమైనదికాదు. టర్కీరాజధాని కాన్ స్టాంట్ నోపిల్ లోని ఆసుపత్రులను పెద్ద పెద్ద భవనాలను ఫ్రెంచివాళ్ళు వాడుకుంటున్నారు. ఇక బ్రిటిష్ సైనికులకు ఆసుపత్రికి మిగిలింది. ''స్కూటర్'' అనే చోట గల భవనము. అదే బ్యారక్ ఆసుపత్రి. ఫ్లారెన్స్ బృందము 4-11-1854న అక్కడికి చేరింది. అప్పుడామెకు 34 సం॥ .రాలు.

ఆ ఆసుపత్రి ఎలావుందో తెలుసుకునే ముందుగా ఆసుపత్రి అంటే మనకు తెలిసిన విషయాలను మరిచిపోవాలి. కరకురాళ్ళు పరిచిన నేలలో పగుళ్ళు వాటిలో లుకలుకలాడే చీమలు, క్రిమిక్రీటకాలు. చాలా ఎత్తున కిటికీలున్నాయి. కాని అవి తెరవడానికి వీలులేదు. వంటకు, ఆపరేషన్లకు నర్సులకు, గదులులేవు. రెండు ఫర్లాండుల పొడవున, ఐదు అంతస్థుల ఎత్తున సైనికుల కొరకు కట్టిన బ్యారక్స్ అవి. వాటిమధ్యలో చెత్తచెదారం కుప్పలుగా పోగుబడి వుండేది. వాటి ప్రక్కనే ఒక మంచినీళ్ళ కుళాయివుంది. ఒక రోజు ఒక కిటికిదగ్గర చచ్చివున్న ఆరుకుక్కలను నైటింగేలు చూసింది అలాటివి అక్కడ సాధారణ విషయాలు. పంపునుండి వచ్చే నీళ్ళు కూడా చెడు వాసనతో ఉండేవి. నీళ్ళను వేడిచేసే మార్గం లేదు. బాయిలర్లు లేవు. మరుగుదొడ్ల వసతి ఇంకా హీనముగా వుండేది.

అది 1200 రోగులకు ఉద్దేశించిన ఆసుపత్రి. కాని యుద్ధమువల్ల అనేకరెట్లు ఎక్కువమందిని అందులోనే వుచంక తప్పలేదు. గాయపడిన వాళ్ళను ఆసుపత్రికి తీసుకురావడానికి గుట్టలు, కొండల బాటగుండా ఆరేడురోజులు పట్టేది. ఈలోపు ప్రయాణములో వత్తిడినితట్టుకోలేక చాలామంది చనిపోయేవాళ్ళు. నెత్తురుతో తడిసి బిగుసుకుపోయిన ముతకగుడ్డలు గాయాలకు అతుక్కొని బాధించేవి. మరోవైపు ముఖాలు పాలిపోయి మృత్యుముఖంలోకి పోబోయేముందుగా అపస్మారక దశలోవున్న కలరా రోగులు. ఆ మురికికూపానికి తోడు విపరీతమైన చలి. మంచాలు, పరుపులులేవు. దుప్పట్లు, మందులైనాలేవు. కొరతలన్ని కాక సిబ్బందిలో నిర్లప్తత, అవివేకం, అనాసక్తత పరిస్థితులను మరింతగా దిగజార్చాయి. ఒకరోజు అందులో 1715 మంది రోగులను చేర్చారు.

ఫ్లారెన్స్ పాదం మోపిన రోజునే మరో 500 మంది రోగులు వస్తారని కబురువచ్చింది. ఉన్న వాళ్ళలో కొందరికి రక్త విరోచనాలు ప్రారంభమయ్యాయి. కొందరు చలికి తట్టుకోలేకపోయే వాళ్ళు, నేలమీద గడ్డి అయినా పరచి పడుకోబెట్టడానికి అక్కడ చోటు కూడా లేదు. అందుకే ఎవరైనా ఆఖరిశ్వాస విడిచి విడవకముందే అడడిని తొలగించి మరొకరిని పడుకోబెట్టవలసి వచ్చేది. పరిస్థితులు ఆమె సహనానికి పరీక్షలు వుండేవి, రోగులు చలికి బిగుసుకుపోతుంటే అనుమతిలేదని స్టోరు అధికార్లు చొక్కాలు ఇచ్చేవాళ్ళుకారు. ఆమె అందుకు కోపగించుకోకుండా కొన్నివేల చొక్కాలను కొని రోగులకు పంచి పెట్టింది.

యుద్ధరంగములో ఉద్రిక్తత పెరిగేకొలది ఆసుపత్రిలో పరిస్థితి చాలా హీనస్థాయికి దిగజారింది. ఆమె వెళ్ళి రెండు వారాలయింది, 1700 మందికి కష్టముగా వసతి సమకూర్చగల్గిన చోట నాలుగువేల మందిని కుక్కాల్సి వచ్చింది. మరణాల సంఖ్య తారాస్థాయికి చేరింది, ఖచ్చితమైన అంకెలు తెలియవు గాని ఆసుపత్రిలో చేరినవాళ్లలో నూటికి 40 మంది అక్కడే మరణించారు.

అగ్నికి ఆజ్యం తోడయినట్లు నవంబరులో ఒక తుఫాను వచ్చి, కొన్ని బ్రిటిష్ నౌకలను ముంచివేసింది. దీనితో సామాగ్రి, మందులు కూడా నీళ్లపాలయ్యాయి.

అయినా ఆమె నిరాశచెందలేదు, ఆలోచనలతో కాలం వృధాచేయలేదు, ఉన్న కొద్దిపాటి వనరులనే ఉపయోగించుకుంటూ పనికి ఉద్యమించింది, పర్వతమంతపని ముందున్నదని భయపడలేదామె, ఆపదలలో, బాధలలో ఉన్నవారికి చేతనైన సేవచేసుకుంటూ ముందుకు సాగడమే ఆమె లక్ష్యం, కాని ఆమె అనుచరులు నిరాశచెందారు, నిద్ర నుంచి మెల్కొవాలంటే చూడబోయే దృశ్యాలు గుర్తు వచ్చి వాళ్ళకు భయము వేసేది, కాని ఫ్లారెన్స్ క్రుంగిపోలేదు, చిన్న గదిలో ఒక మూలన మరో సిస్టరుతో కలసి తనవసతి ఏర్పాటు చేసుకుంది. అందులోనే మందులు, సామగ్రి, పరికరాలు అన్ని అమర్చింది.

క్రొత్తగా వచ్చే రోగులను ఉంచటానికి వరండాలు మాత్రమే ఖాళీగా వున్నాయి. కాని అక్కడ భరించలెని చలి గచ్చునేల మంచుగడ్డలా గల్లగా ఉండేది. మొదట అలాగే నేలపైరన గడ్డిపరచి రోగులను పడుకోబెట్టారు. తరువాత సిస్టర్లు చేత గోనెసంచులలో గడ్డికూరిపరుపుల్లా చేయించింది. చల్లదనము తగ్గడానికి అడుగున చెక్కముక్కలు వేయించింది. అక్కడే వాళ్లగాయాలు కడిగి పుండ్లకు కట్టుకట్టేవాళ్ళు, స్త్రీలకు పిల్లలకు మాత్రమే పరిచర్యలు చేసిన అనుభవము వుంది. ఫ్లారెన్స్కు, పురుషుల సేవ ఆమెకు క్రొత్త, తనవెంట తెచ్చిన దుప్పట్లు, దిండ్లు కొందరికి పంచింది. దాదాపు యాభైవేల చొక్కాలు పంచి పెట్టింది. మరణావస్థలో వున్న వాళ్ళకు కాస్త మరుగు ఏర్పాటు చేయడానికి కొన్ని కాన్వాను పట్టాలను అడ్డం కట్టింది. మందులు ఏవి ఎవరికి ఇవ్వాలో సిబ్బందికి తెలియదు.

త్వరలోనే ఆమె తెచ్చిన దుప్పట్లు అయిపోయాయి. చనిపోయిన వాళ్ళకు చుట్టబెట్టడానికి కూడా దుప్పట్లు లేవు. బ్రతికి వున్నవాళ్ల అవసరాలకు ప్రాధాన్యత ఇవ్వవలసి వచ్చింది. నిన్నటిదాకా మాతృదేశం కోసం పోరాడి అసువులు బాసిన సోదరుల అంతిమ యాత్రకు కనీసం దుప్పట్లు కూడా కరువయ్యాయని సైనికులు కలతచెందారు, నిరసన తెలయజేశారు. కాని ఆమె తన హృదయాన్ని కఠినతరం చేసుకోవడం తప్ప చేయగలిగిందేమీ లేదు.

శుభ్రం చేయడానికి బొచ్చలు, తువ్వాళ్లు, సబ్బులు అయిపోయాయి. నేల తుడిచే కుంచెలు 300 పంపమని వ్రాసింది. ఎలుకలు రోగుల పడకల మీదుగా పరుగులెత్తేవి. నల్లులు, పేలు, పుండ్లలో పురుగులు సర్వసాధారణ దృశ్యాలు. గోడలనిండా మురికి శుభ్రం చేయ వీలుకానంతగా పేరుకు పోయింది. నవంబరు నెల చివరిలో అక్కడి పరిస్థితులను ఊహించవలసిందే. ఆమె తన అనుచరులతో కలసి చీపురు కట్ట, గుడ్డలు వాడి నేలమీద మోకరిల్లి తుడిచి శుభ్రం చేసింది. గదులలో కాస్త వేడి కల్గించడానికి బొగ్గు బాయిలర్లను వాడింది. వరండాలలోని రోగులకు కొన్ని ఏర్పాట్లు చేసింది. ఇట్లా పరిశుభ్రతకు వీలయినంత కృషిచేశాక ఆహారం విషయం చూసింది.

వంట ఒక మూలన చేసేవాళ్ళు. పొడవాటి వార్డులు కావడంవల్ల ఒక పంక్తి భోజనాలు అయ్యేసరికి కొన్ని గంటలు పట్టేది. మంచినీళ్ళు సరిగా వేడిచేయడానికి వసతులు లేవు. దొరికినపుడు డికీ ఉడకని మాంసం ఇచ్చేవాళ్ళు. తినిడానికి ప్లేట్లు,చెంచాలు లేవు. వడ్డించడానికి కూడా సామాగ్రి లేదు.

చేతులతో తీసి రోగులకు పెట్టేవాళ్ళు, ఆకలితోవున్న వాళ్ళు గూడా తినలేరు ఆ వంటకాలు. ఫ్లొరెన్స్ ఆ స్థితిని మెరుగుపరిచింది. అవసరమైన వాళ్లకు గంజి, జావ ఇప్పించింది. స్టౌలు పెట్టి నీళ్ళు కాచడానికి అధికారులు అంగీకరించలేదు. స్పిరిట్ దీపాలమీదనే కాఫీ, టీలు కాచి ఇచ్చింది, మరీ అవసరమైన రోగులకు, తన సౌఖ్యాన్ని గురించి పట్టించుకోకుండా ఓర్పుతో పనిచేస్తూ, ఇతరులచేత చేయిస్తూ బాధార్తులకు ఉపశమనం కల్గించిందామె. అందరికి చేతిగుడ్డలు ఇచ్చింది. తాను దగ్గర వుండి రోజుకు 3, 4 సార్లు మరుగు దొడ్లను శుభ్రం చేయించింది. గుడ్డలను శుభ్రంగా ఉతకడానికి క్రొత్తగా ఒక లాండ్రిని ఏర్పాటు చేసింది. వార్డులకు దగ్గరగా రెండు వంటశాలలను నిర్మించింది. మాంసంలో ఎముకలను తీసివేయించి సులువుగా జీర్ణం కావడానికి చిన్న ముక్కలుగా కోయించి మెత్తగా వండించింది. ఈ విధంగా కాలుమోపిన నెలరోజులలోనే భూలోక నరకంలాగావున్న ఆ ఆసుపత్రిలోని వారి జీవితాలను ఆశావహంగా మళ్ళించగలగడానికి ఆ అబలకు సహాయపడినవి ఆమె ధైర్యసాహసాలు, పట్టుదల, పరిశ్రమ.

అక్కడ వైద్యం పొందినవాళ్ళు ఆమెను ఒక పాలనాదక్షురాలిగా, గొప్ప నిర్వాహకురాలిగ మాత్రమేకాక బాధల నుంచి విముక్తి కలిగించడానికి లాంతరు పట్టుకువచ్చిన స్త్రీమూర్తి (లేడి ఆఫ్ ది ల్యాంప్) అవసరమయితే అధికార్లతో పోట్లాడటానికి ఆమె తన వజ్రసంకల్పాన్ని ఇంకా దృఢపరచుకునేది. కాని రోగులు, బాధితులపట్ల ఆమె కారుణ్యం, ధయ మూర్తీభవించిన అమ్మ. ఐశ్వర్యము, ఖసుశాంతులను వదలుకొని తమను కాపాడుటకు వచ్చిన దేవదూత.

ఆమెకు రోజంతా పనే. తరచుగా రోజుకు 8 గంటలు రోగులకు కట్లు కడుతూ నిలబడే వుండేది. ఒకసారి ఏకబిగిన 24 గంటలు నిలువుకాళ్ళమీదనే పనిచేసంది. ఆమెకు వ్యాధులు సోకుతాయనే భయంలేదు. కలరా వాతబడి మృత్యువుతో పోరాడే రోగులకు గంటల తరబడి సేవలు చేసేది. ఆమెకు నిస్పృహ అంటే ఏమిటో తెలియదు. ఒక సారి డాక్టర్లు ఐదుగురు రోగులను బ్రతికే ఆశలేదని వైద్యం చేయకుండా వదిలేశారు. ఆమె రాత్రంతా మేల్కొని పరిచర్యలు చేయగా వాళ్ళు బ్రతికిబయటపడ్డారు.

సాధారణ నర్సులను వార్డులలోనికి వెళ్లనివ్వరు. కాని ఆమె సూపరింటెండెంట్ గనుక వెళ్ళవచ్చు. తోటి నర్సులు పగలంతా పనిచేసి అలసిపోయి క్రిక్కిరిసిన తమ గదులలో విశ్రాంతి తీసుకుంటుంటే ఫ్లొరెన్స్ ఒక లాంతరు చేతపట్టుకొని వార్డులలోని రోగులను చూడడానికి వెళ్ళేది. క్రొవ్వువత్తుల గుడ్డివెలుతురులో నాలుగు మైళ్ళ పొడుగునవున్న వరండాలలో నడిచేది. ఒక వరుస పడకలకు మరో వరసకు మూరెడు ఖాళీ మాత్రమే ఉండేది. వరండాలలో అయితే నడిచి వెళ్ళడంగూడా ఇబ్బందే. సైనికులు వీలైనంత వరకు బాధను భరించేవాళ్ళు. ఆమె అందరితో మాట్లాడే వీలుకాదే. చిరునవ్వుతో తల వూపుతూ ముందుకు సాగేది. ఆమె నీడగోడమీద ముందుకు జరుతుంటే సైనికులు గౌరవ భావంతో ఆ నీడను కళ్లకద్దుకొని తృప్తి గా పడుకునేవాళ్ళు.

బాగా దెబ్బలుతిన్న సైనికులు శరీరభాగాలను ఆపరేషన్ చేసి తొలగించవలసి వచ్చేది. కాని అప్పట్లో మత్తుమందులు లేవు. ఎంత బాధనైనా భరించవలసిందే. ఆపరేషన్ గదంతా రక్తపుమయం. దాన్ని చూస్తేనే ఉన్న ప్రాణాలు కూడా పోయేవి. అరుపులు, కేకలతో కూడిన భయంకర దృశ్యాలు. కాని ఫ్లొరెన్స్ తన గుండె నిబ్బరాన్ని నడలనివ్వలేదు. ఆ గదిలో ఆమె చేతులు కట్టుకుని నుంచుంటే సైనికులకు కొండంత అండగా వుండేది.

సైనికులు బాధల్లో ఉన్నపుడేకాక కోలుకునేటపుడు కూడా ఆమె సహాయపడేది. సైనికుల బంధుమిత్రులకు ఉత్తరాలను వ్రాసి పెట్టేది. తమ

కొడుకులకు బాగా కనిపెట్టి వుండమని వేడుకుంటూ ఆమెకు సైనికుల తల్లులు ఉత్తరు వ్రాసేవాళ్ళు. ఆమె పరిచర్యలకు సైనికుల బంధువులు ధన్యవాదాలు తెలిపేవాళ్ళు.

అక్కడే మరోవర్గమువారికి గూడా సహాయము అవసరమని ఆమె గమనించింది. ఆసుపత్రిలో ఒక గదిలో హృదయ విదారకముగా కొందరు మహిళలున్నారు. కొకిదరు సుస్తీగాను, కొందరు ప్రసవంచడానికి సిద్దంగానుఉన్నారు. మంచాలు, సామాగ్రి ఏమీలేని ఆ గది తేమగా వుంటుంది. వీళ్ళు సైనికుల భార్యలు, వీళ్లను పట్టించుకునే వాళ్ళులేరు. ఆ రోజుల్లో భర్తల వెంట యుద్దారంగానికి వెళ్లడానికి భార్యలను అనుమతించేవారు. లేడీ ఆలీషియా సాయముతో ఆ గదిని బాగుచేసింది. బాయిలర్లు, లాండ్రీ ఏర్పాటుచేసింది. వాళ్లకు కాస్త పనికల్పించింది. ఒక ధనవంతురాలి సహాయముతో మంచిభవనాన్ని అద్దెకు తీసుకొని దానిలో ప్రసూతి, శిశు పోషణాలయం నెలకొల్పింది. డిసెంబరులో ఆరోగ్యమైన వాతావరణములో 22 మంది శిశువులు జన్మించారు.

మరణించిన వందలమంది సైనికుల స్మృతిచిహ్నాముగా సముద్రము ఎదురుగా కొండమీద స్కుటారి అనేచోట ఒక స్మారక స్థూపాన్ని ఏర్పాటుచేసింది. ఆనాటి సైనికుల బాధలకు, నైటింగేలు సేవలు మూగసాక్షిగా అది నేటికి అక్కడ నిలచివుంది.

అత్యవసరముగా చేయవలసిన సంస్కరణలు అయ్యాక కాస్త ఊపిరి పీల్చుకుంది. ఆమెకు వసతి ఇబ్బందిగా వుంది. 38 మంది నర్సులకు నాల్గుగదులు కేటాయించారు. స్టోరుకు ఒక గది మాత్రమే ఇచ్చారు. ఆమె ఎప్పుడూ ఇబ్బందులను గురించి ఫిర్యాదు చేయదు.

అక్కడ రోగుల రద్దీని తగ్గించాటనుకుంది. నివాసయోగ్యంకావని ఖాళీగా వుంచిన రెండు పెద్ద భవనాలను తన డబ్బుతో బాగుచేయించడానికి టర్కీ కూలీలతో పని ప్రారంభించింది., కొంతపని అయాక వారు కూలి పెంచాలని సమ్మెచేశారు. 800 మంది కొత్తవాళ్ళతో పనిపూర్తి చేయించింది. ఆ డబ్బు

అంతా వృధా అనేవాళ్ల విమర్శలు పట్టించుకోకుండా పనిచేసింది. వార్డుల కిటికీలు, తలుపుల రెక్కలు తెరవడానికి వీలుకాలేదు. పైకప్పులో కొన్ని చిన్న బెజ్జాలు వేయించింది., కాస్తగాలి ప్రసారం మొదలయింది. ఇంజనీర్లతో సంప్రదించి బాయిలర్లను, మంచినీటి సరఫరాను సమకూర్చింది. ఆమె చేయవలసింది రోగుల పరిచర్య మాత్రమే కాని ఎంతోమంది అధికారులు ఉన్నా ఈమె మరి కొన్ని పనులు చేయించవలసి వచ్చేది.

30 వేల మంది సైనికులలో 20 వేల మంది చనిపోయాలరంటే అందులో ఎక్కువమంది అనారోగ్యం వల్లనంటే ఆనాటి ఆసుపత్రి స్థితిగతులు ఎలా వుండేవో ఊహించవచ్చు.

ఇంగ్లాండు నుంచి చాలా విరివిగా దుప్పట్లు, చొక్కాలు పంపేవాళ్ళు కాని అవి ఆసుపత్రికి చేరేవికావు. ఏమవుతాయో తెలియదు, వాటి కోసం ఆమె గట్టిగా పోరాడింది.

అధికారుల కుంటిసాకులు అడుగడుగుకూ అడ్డంపవచ్చేవి నిమిషాలలో తీసుకోగల నిర్ణయాలు నెలలు కూడా గడిపేవాళ్ళు. 31 మంది క్రొత్త నర్సులు వచ్చారు. అందులో కొందరు అక్కడ వుండలేక వెంటనే తిరిగిపోయారు. మిగతావాళ్ళు ఒకళ్ళతో మరొకళ్ళు పోట్లాడుకునే వారు. అది చూసి ఆమె ఒకాసారి అన్నది ''నాలుగువేలమంది రోగులనైనా సముదాయించవ్చుగాని నలభై మంది నర్సులను సర్దిచెప్పడం కష్టం'' అని. ఆమె నర్సులను ఒంటరిగా బయటకు వెళ్లనిచ్చేది కాదు. వాళ్ళను మద్యం తాగనివ్వలేదు.

**ఆమె విజయాలు:**

మొత్తం సైనికులు 30 వేలమంది వున్నారు. అందులో 25 వేలమంది ఆంగ్లేయులు, 3వేలమంది జర్మన్లు, 2 వేలమంది స్విస్వాసులు, ఏర్పడ్డ ఖాళీలను ఎప్పటికప్పుడు భర్తీచేస్తుంటారు. క్రిమియా యుద్దరంగానికి మొత్తం ఒక లక్ష ఐదువేలమందిని పంపారు.

శత్రువుతచేత చంపబడ్డవారు, గాయపడ్డవారు 10 వేల మంది, ఆసుపత్రిలో చేరినవారు మొత్తం 70 వేలమంది దాకా వున్నారు. అక్టోబరు నెలలో రోగులలో నూటికి 41 మంది మరణించగా మార్చి ఆఖరుకు వెయ్యికి 22 మంది మాత్రమే మరణించారు.

అనుకూల వాతావరణం ఏర్పడం కూడా ఇందుకొక కారణము. చలికాలం పోయి మరణాల సంఖ్య తగ్గిందని తృప్తిపడుతుండగానే టైఫాయిడ్, కలరాలు విజృంబించాయి. కలరా సోకిన రోగులలో నూటికి అరవైమంది దాకా మరణించేవారు. జబ్బు సోకిన 5 గంటలలోనే చాలామంది చనిపోయేవారు.

ఇప్పటికే ఇంగ్లాండులో ఇంటింటా ఆమె పేరు పరిచితమయింది. ఆమె సేవలు తెలిశాయి. సైనికులకు ఆమె ద్వారా బహుమతులు పంపసాగారు పౌరులు. విరాళాలు వెల్లువలా కొనసాగాయి. వాటినన్నిటిని ఆమె సద్వినియోగపరచింది. ఆమె తన ధృఢనిశ్చయం, చెక్కుచెదరని సంకల్పాలతో గందరగోళం, గజిగజి నెలకొని వున్నచోట క్రమశిక్షణ తీసుకువచ్చింది. ఎండ తీవ్రత, ఎముకలు కొరికే చలిగాలులు విం విరుద్ధ వాతావరణంలో కూడా రోజుకు ఇరవై గంటలు పనిచేసింది. ఏడెనిమిది గంటలు ఏకబిగినమోకాళ్లపై కూర్చొని కట్టుకట్టింది.

కాని అనుకోకుండా క్రిమియాలో ఆమె అనారోగ్యం పాలయింది. ఈ విషయం తెలిసి ఆమె బంధుమిత్రులే కాక ఇంగ్లాండు దేశమంతా ఆందోళన చెందింది. వైద్యులు, సైనికులు కలత చెందారు. అంతా యుద్ధంలో ఓడిపోయినంత బాధపడ్డారు. ఆమె త్వరగా కోలుకోవాలని ప్రార్ధనలు చేశారు.

వాళ్ళ ప్రార్ధనల ఫలితమా అన్నట్లుగా దాదాపు మరణ దశ నుంచి కోలుకున్నది. ఇంగ్లాండు వెళ్ళి విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చారు. వైద్యులు, బ్రతిమలాడారు అధికారులు. ఆమె అంగీకరించలేదు. యుద్ధము ముగిసి చివరి సైనికుడు కూడా స్వదేశానికి తిరిగి వెళ్ళేవరకూ ఆమె యుద్ధరంగాన్ని వదలిపోనన్నది.

ఫ్లారెన్స్ నౌటింగేల్ అత్తయ్య వెళ్ళి ఆమెకు పరిచర్యలు చేసింది. ఆమె ఆరోగ్యం ఇంకా మెరుగుపడింది. శారీరకంగా ఎంత అలసిపోయినా, ఆమె ధైర్యం మాత్రం సడలలేదు. పైగా కర్తవ్య నిర్వహణద్వారా తన జన్మసార్ధకమవుతుందని తృప్తి చెందింది. తిరిగి స్కూటారీకి వచ్చింది.

మళ్ళీ క్రిమియా ప్రాంతమంతటిని గుర్రముమీద తిరిగి చూసింది. యుద్ధరంగములో సైనికులు ఆమెకు వందనాలు చేశారు. వారికష్టాలను ఆమె స్వయముగా తెలుసుకొంది. సైనికుల జీవితాలు యుద్ధసమయములోనైనా క్లిష్టంగానే వుంటాయి. కాని ఇక్కడ సైనికుల గురించి ఎవరూ పట్టించుకోవడము లేదా అన్నంత దుర్భరముగా ఉన్నాయి పరిస్థితులు సరిపడేంత తిండికూడా లేదు.

ఆమె మళ్ళీ బ్యారక్స్ ఆసుపత్రికి వచ్చింది. రోగులు ఉత్తరాలు వ్రాసుకోవడానికి కాగితాలు, పెన్సిళ్లు, అందజేసింది. చదువుకోవడానికి పుస్తకాలు, బొమ్మలపుస్తకాలు, వార్తాప్రతికలు పంచింది. చదువు నేర్పించింది సంగీతము విన్పించింది. నాటకాలు వేయించింది. చదరంగము ఆటకు వీలు కల్పించింది. స్లైడ్ ప్రొజెక్టర్సు ద్వారా బొమ్మలు వేసి వినోదము పంచింది. ఆడగల్గితే పుట్ బాల్ కూడా ఆడమని ప్రోత్సహించింది. సైనికులు తమ మొత్తము జీతాలు తాగడానికి పాడుచేసుకునేశాళ్ళు. ఆమె దాన్ని ఆపించి పొదుపు చేయడము చేర్పింది. ఆరునెలల్లో సైనికులు 71వేల పౌండ్లు ఇళ్లకు పంపేలాచూసింది. ఆసుపత్రిలో వున్నంతకాలము సైనికులకి చాలా తక్కువ జీతము ఇచ్చేవారు అధికారులు, ఆమె అందుకు వ్యతిరేకముగా పోరాడి జీతాన్ని పెంచగలిగింది, సైనికులు సంతోషముగా కుట్టుపని, ఎంబ్రాయిడరీ నేర్చుకున్నారు.

ఇలా వాళ్ళు బాధలను మరిచిపోయి త్వరగా కోలుకునే లాగా చూసింది. మే నాటికి యుద్ధము ముగిసింది. సైన్యము వెంటనే యుద్ధరంగము నుంచి ఫసంహరించుకోవాలి. ఇక ఫ్లారెన్స్తో పనిలేదు. ఆమె కూడా సైనికులతో కలసి వెళుతుందనుకున్నారు. కాని ఆమెకు ప్రచారము ఎంతమాత్రము గిట్టదు.

సైనికులు వెళ్ళాకకూడా కొన్నాళ్ళు ఆమె అక్కడే వుంది. నిన్ని మొన్నటి దాకా క్రిక్కిరిసిన బ్యారక్ నిర్మానుష్యం అయ్యాయి.

ఈ క్రిమియన్ కాంతిరేఖకు ఎవరెవరో ఎన్నో బహుమతుల నిస్తామన్నప్పటికీ ఆమె అంగీకరించలేదు. టర్కీసుల్తానులు బలవంతముగా ఇచ్చిన బంగారుచేతి వంకీని మాత్రము తీసుకుంది.

యుద్ధము ముగిసి శాంతి నెలకొన్నది. అయినామానవ బాధలను తగ్గించడానికై తన కృషిని ఆపలేదు. కొంతకాలము విశ్రాంతి తీసుకొని మళ్ళీ కార్యరంముగలోకి దిగింది. నర్సుల శిక్షణకు ఒక పథకము ఆలోచించి కొన్ని ప్రతిపాదనలు చేసింది. వాటికి అంతులేని ఆదరణ లభించింది.

ఆమె పేరు ప్రఖ్యాతులు మారుమూలలకు గూడా విస్తరించాయి. ఇంగ్లాండులో ప్రజలు తమ అమ్మాయిలకు, నౌకలకు, పందెపు గుర్రాలకు, వీధులకు ముద్దుగా ఫ్లారెన్స్ అనీ, నైటింగేలు అనీ పేర్లు పెట్టుకున్నారు. ఆమెను స్తుతిస్తూ పాటలు పాడుకున్నారు. చేతిలో లాంతరు పట్టుకొన్న ఆమె ప్రతిరూపపు మట్టిబొమ్మలు ప్రతిచోటా ళనిపించేవి. ఆమె సేవలను చవిచూసిన సైనికుల బంధుమిత్రులే కా తమదేశానికి విభిష్ట సేవలు చేసినందుకు సాధారణ ప్రజలు, రాజకుటుంబం కూడా ఆమెను అభిమానించింది. రాణిగారు ఒక వజ్రాలు పొదిగిన మెడల్ను బహుకరించింది. పౌరసన్మానం చేస్తామంటే ఫ్లారెన్స్ ఒప్పుకోలేదు. ఆమె ఆశయాల సాధనకు కృతజ్ఞతతో కొంత నిధిని సమకూర్చాలనుకున్నారు. అన్ని రంగాల వారి నుంచి విరాళాలు 47 వేల పౌండ్లు వసూలయ్యాయి. ఒక సంగీత కచేరిచేసి కొంత ధనం సమకూర్చారు.

నర్సింగ్ పాఠశాలను స్థాపించి దానిని ఒక మంచి ఆసుపత్రికి అనుసంధానం చేశారు. 1860లో మొదటి బ్యాచ్లో 15 మందిని ఎంపిక చేశారు. వారికి ఏటా పది పౌండ్ల స్కాలర్ షిప్ ఇచ్చారు. క్రమశిక్షణకు ప్రాధాన్యత ఇచ్చేది ఫ్లారెన్స్. ఆమె అదేవానుసారం శిక్షణ కొనసాగింది.

రెడ్ క్రాస్ స్థాపకుడైన స్విన్ దేశీయుడు హెన్రీడ్యురాంట్ ఫ్లారెన్స్ పనులవల్ల ప్రేరణ పొంది నర్సుల శిక్షణ ప్రారంభించాడు.

ఏటా ఏ పదిమందికో ఆమె శిక్షణఇస్తే వారు అవసరాలకు ఏమూలకు సరిపోతారు! అందుకని కనీసం కొంత సమాచారాన్ని ఐనా పాఠశాలద్వారా ఎక్కువ మందికి అందించాలనుకుంది. మొదట ఆసుపత్రుల గురించి ఒక చిన్న పుస్తకం వెలువదరించింది. తరువాత 1859లో నర్సింగు గురించి మరో పుస్తకం వ్రాసింది. లెక్కలపట్ల ఆమెకున్న అభిరుచితో గణాంక వివరాల అవసరాన్ని గుర్తించి వాటిని బాగా సేకరించింది.

స్వచ్ఛమైన గాని, వెలుతురు, పరిశుభ్రమైన వాతావరణం ద్వారా వ్యాధుల వ్యాప్తిని తగ్గించవచ్చని చెప్పంది. అంతకుమునుపు గాలి, వెలుతురు వుంటే వ్యాధులు పెరుగుతాయనుకునేవారు. ఆమె చెప్పిన వాటిని చేసి చూపి నిరూపించింది. ఇనుప మంచాలద్వారా నల్లులబాధ తగ్గించింది. పరుపులలో గడ్డికి బదులు ఉన్నిని బెట్టించింది. ఇటువంటి వివరాలున్న పుస్తకం బాగా ప్రచారం పొందింది. ఈ నూతన ఆలోచనలను అన్ని తరగతులప్రజలూ అభినందించారు. వాస్తు శిల్పులూ, ఆసుప్రతుల నిర్వాహకులు ఆమెను సంప్రదించసాగారు. నర్సింగును గురించిన పుస్తకం ఒక నెలలో 15 వేల కాపీలు అయిపోయాయి. నర్సింగు వృత్తిలో వుండి ఏ శిక్షణా పొందని వారికి అవి బాగా పయోగపడ్డాయి. చేయవలసింది ఇంకా ఎంతో వుంది. చేసినదంతా ఆరంభం మాత్రమే అనుకునేది. ఆమె మిలటరీ ఆసుప్రతుల అభివృద్ధికి ప్రణాళికలను రూపొందించసాగింది.

**వ్యక్తిగత జీవితం:**

క్రిమియా నుంచి వచ్చాక ఆమెబాగా అలసిపోయింది. బంధుమిత్రులు విశ్రాంతి తీసుకొమ్మన్నారు. అప్పటికామెకు 36 ఏళ్ళే. ఇప్పుడు గూడా తల్లితో, సోదరితో సరిపెట్టుకోలేకపోయింది. అంతవరకూ చలాకీగా ఉన్న మె నిస్త్రాణగా ముడుచుకొని వుండేది. చూడటానికి వచ్చిన వాళ్లను ఎవరినీ కలిసేదికాదు.

ఆరోగ్యాన్ని గూర్చి అడిగితే కోపడేది. కొన్ని నెలలు ఇంట్లో వుంది. తర్వాత ఒక హోటలు గదికి మారింది. తరువాత మరొ ఇంటికి, మరొచోటికి, ఇలా మూడుసార్లు మారింది.

**ఆమె లక్ష్యం బ్రిటిషు సైనికుల సంక్షేమం:**

1854 తర్వాత ఆమె బ్రిటన్ సైనికుల సంక్షేమం వైపు దృష్టి మరలించింది. అందుకు విదేశాలలోవున్న బ్రిటీష్ సైనికుల పట్లకూడా ఆమె శ్రద్ధ చూపంది. భారతదేశం ఈ రకంగా ఆమె దృష్టిలో పడింది. 1857లో సిపాయిల తిరుగుబాటు జరిగింది. ఆమె మిలటరీలో చేరాలనుకుంది. కానీ తీవ్ర అనారోగ్యం వల్ల ఇల్లుదాటి బయటకు రాలేకపోయింది. తిరుగుబాటు విఫలమైంది పరిపాలనా సంస్కరణలు ప్రారంభమైనాయి. ఫ్లొరెన్స్ ఇండియాలనే శ్వేత సైనికుల పట్ల శ్రద్ధ చూపింది. తరువాత భారత సైనికులను గూడా పట్టించుకొంది. శ్వేత సైనికుల్లో మరణాలు ఎక్కువగా వుండేవి, 73 వేలమందిలో ఏటా 5 వేలమంది చనిపోతూన్నారు. గణాంక వివరాలు పేకరించి, విశ్లేషించి చూసింది, 1859లో ఆమె ప్రయత్నం వల్ల రాయల్ కమీషన్ ఏర్పడి సైనికుల ఇబ్బందులను విచారించింది. పారిశుద్ధ్యం తగిన స్థాయిలో లేక కలుషిత గాలి, నీరు, ఆహారాలవల్ల సైనికులు రోగాలపాలై మరణిస్తున్నారని తేలింది.

బొంబాయిలో తిరుగుబాటు అయిపోయింది. మనుషులు, గుర్రాలు, గాడిదలు, ఎద్దులు, ఏనుగుల శవాలు నగర వీధుల్లో నిండిపోయాయి. వాటిని తొలగించే వాళ్ళు లేరు. అవి కుళ్ళిపోయి దుర్గంధాన్ని వెదజల్లుతుండేవి. ఇంతకు మునుపెన్నడూ అటువంటి సంఘటన జరగలేదు గనుక ఏమి చేయాలో అధికార్లకు అనుభవములోలేదు. కొన్ని జిల్లాలలో ఆరోగ్యం మరీ అధ్వాన్నముగా వుంది. అటువిం చోట్లకు సయినికులను పంపవద్దని, తప్పనిసరయి పంపినా కొద్దికాలమే వుంచాలని సూచన చేసింది ఫ్లొరెన్సు. అప్పట్లో ఆమెకొక గొప్ప ఆలోచన మొదటిసారిగా కలిగింది. నీటిసరఫరా మెరుగు పరిస్తే

పంటపొలాలకేగాక త్రాగటానికి కూడా పయోగపడ్తాయని, శుభ్రమైన నీరు అందజేస్తే వ్యాధులను తగ్గించవ్చు ననేది ఆ ఆలోచన.

లారెన్స్ అనే అధికారిని నియమించి 25వేల జనాభాకు మించిన పట్టణాలలో శానిటరీ సిబ్బందినివేశారు. 1891 నాటికి సంతృప్తికరమయిన అబివృద్ధి కనిపించింది. భారతదేశములో ప్రజలు చనిపోకుండా బ్రతికి వుండటమెలా అన్ని కొన్ని వ్యాసాలను వ్రాసింది, సైనికులకు వినోదం కల్గించడమే కాక పౌరులకు పారిశుద్ధ్యం మెరుగుపరిచింది, ఈ విధంగా ఇండియాలో ఆరోగ్య సేవలు ప్రారంభించడానికి ప్రారంభకురాయిందామో.

తరువాత అండన్కు తిరిగివెళ్ళి సుఖముగా జీవించింది. తండ్రి మరణాంతరము ఆమెకు బాగా ఆస్థి లభించింది. ఆమె ఔదార్యము వివిధ రంగాలకు విస్తరించింది. పేదల సంక్షేమం ఆగర్భ దరిద్రులకు వైద్యసదుపాయాలు, శ్రామికుల ఇండ్లలోని రోగులకు పరిచర్యలు, మురికివాడల అభివృద్ధి, అనాధ పిల్లలకు ఆశ్రయము మొదలైనవన్నీ ఆమె పట్టించుకుంది వాటి ఎడల తాను కృషి చేసింది ఆనాడామె అనుకున్నవే ఇప్పటికీ సంస్కరణలుగా అమలు జరుగుతున్నాయి ప్రపంచములో.

తరువాత జైళ్ళ సంస్కరణలు చేపట్టింది. మహిళా ఉద్యమాన్ని నడిపింది. మహిళలు జాతీయ జీవన స్రవంతిలో ఎక్కువగా భాగము పంచుకోవాలని బోధించేది. మగవాళ్ళు తమ ఆలోచనలను అవసరమైతే మార్చుకుంటారు. కాని స్త్రీలు అలాకాదు అన్నది. ‘‘ఆడవాళ్ళకు సానుభూతిలేదు రోజంతా సానుభూతి కోసము ఆదారపడటమే తప్ప యితరులకు సానుభూతి పంచిఇవ్వడం వాళ్ళ చేతగాదు. అసలు ఇతరుల మంచి వాళ్ళకు గుర్తే ఉండదు’’ అన్నదొక సందర్భములో ఆడవాళ్ళ లోపాలు చెప్పడానికి వెనకాడలేదామె. వాటిని తొలగించుకొని ఆడవాళ్ళు అభివృద్ధి చెందాలని ఆవేదన చెందింది తల్లిగా, భార్యగా అనుభవాలు మీకులేవుగదా? అని ఎవరైనా ప్రశ్నిస్తేలేవు, అందుకు నేను బాధపడటం లేదు. సంతోషిస్తున్నాను అనేది.

మహిళాలోకమే ఆమెకు రుణపడి వుంటుంది. వారికొక క్రొత్తమార్గము, ఉద్యోగ విధానము, నర్సింగు వృత్తిని చూపించింది. ఓర్పు, పట్టుదలతో పనిచేస్తే ఆడవాళ్ళయినా విజయాలు సాధింవచ్చని ఆమె జీవితమే సాక్ష్యముగా నిరూపించంది పురుషులలాగా మీరుకూడా ముందు అర్హతలు సంపాదించడి అని చెప్పిందామె. ఏ మహరాజో, చక్రవర్తో మాత్రమే తాను అనుకున్న సంస్కరణలు చేయగలడేమో! కాని ఈ అబల తన ఆలోచనలను అసాధారణరీతిలో, ఆదర్శముగా ఆచరించి చూపగలిగింది. ఆమె జీవితకాలములో ఎంత మార్పు!

యువతిగా ఉండగా ఆమె కళాశాలలో చదవాలనుకుంది. ఆ అవకాశం లేదు. 1890 నాటికి ఆక్స్ ఫర్డ్ క్రేంబ్రిడ్డి కాలేజీలు నెలకొల్పారు. స్త్రీ విద్యను నిర్భంధం చేశారు. స్త్రీలకు ఓటు హక్కు ఇవ్వాలనే లోచన వచ్చింది కొందరికి. ఆమె దాన్ని సమర్ధించంది.

అప్పట్లో స్త్రీకి ఆస్థిఏమైనా ఉంటే వివాహం తర్వాత అది ఆమె భర్తకు వస్తుంది. ఆమెకు ఆ ఆస్థిపై ఏ హక్కులేదు. ఈ ఆచారానాకి వ్యతిరేకంగా ఉద్యమం మొదలయింది. దానిని ప్రోత్సహించింది.

శరీరం శిధిలమయిపోయింది. వయోవృద్ధురాలయినా ఆమె భావాలు నిత్యనూతనంగా, చైతన్యవంతంగా నూతన సమాజానికి అనుగుణంగా వుండేవి. ప్రతిరోజూ ఆమె దర్శనం చేసుకోపోవడానికి, సలహాలకొరకు దేశ విదేశీయులు వచ్చి పోతుండేవాళ్ళు. ఆమె కూర్చోలేనిస్థితిలో వున్న ఆలోచనాశక్తి నిర్ణయసామర్ధ్య ఏమాత్రమూ తగ్గలేదు. క్యాబినెట్ మంత్రులు ఫీల్డ మార్షల్స్, మిలటరీ ఉన్నతాదికారులు ఆమెతో చర్చించి నిర్ణయాలు తీసుకునేవారు.

నర్సులకు చిన్నపిల్లలుగా ప్రేమగా చూసుకొనేది. తలపండిపోయింది. ఎక్కువగా సోఫాలో పడుకొని వుండేది, ఆమె సన్నిహితులూ బంధువులూ, శ్రేయాభిలాషులూ చాలా మంది చనిపోయారు. ఆమె దీర్ఘకాలం జీవించింది. వాళ్ళ మరణవార్తలు విని గుండెదిటవు పరచుకునేది. 1879లో విక్టోరియా రాణి వజ్రోత్సవాలు జరిగాయి. ఆ సందర్భంలో ప్రదర్శనకు క్రిమియా యుద్దపు

అవశేషాలును, జ్ఞాపికలను పంపమన్నారు. ఆమె తన ఫోటోను గూడా పంపడానికి ఇష్టపడలేదు. ఆమె ఎన్నడూ కీర్తికొరు ప్రాకులాడలేదు, దానికదివచ్చినా తిరస్కరించింది, తరువాత నైటింగేలు చూపు తగ్గసాగింది. కలం పట్టుకోలేకపోయింది, వేలాది మందికి సపర్యలు చేసిన ఆమె సేవలను అందుకునేస్థితికి చేరింది.

తర్వాత ఆమెకు జ్ఞాపకశక్తి తగ్గిపోసాగింది. పరిసరాల గూర్చి స్పృతగ్గింది, అప్పుడామెకు అధికారపూర్వక సన్మానం చేశారు. 1907లో ఆర్డర్ ఆఫ్ మెరిట్ బిరుదు నిచ్చారు. ఆ బిరుదునందుకున్న స్త్రీ ఆమె ఒక్కతే. మరుసటేడు లండన్ నగరస్వేచ్ఛా పౌరసత్వం ఇచ్చారు.

1910 ఆగస్టు 10వ తేదీన ఆమె అంతిమశ్వాస విడిచింది. నైటింగేల్ గళం మూగబోయింది. ఆమె వీలునామా కూడా విశిష్ఠంగానే వ్రాసుకుంది. ఆమెను రహస్యంగా ఖననం చేయాలని, ఇద్దరికి మించి తన శవం వెంట రాగూడదని కోరుకుంది, తల్లిదండ్రుల సమాధులవద్దఆమెను ఉంచారు. సమాధి ఫలకంపై ఆమె పేరు గూడా లేదు. యఫ్ యన్ 1820-1910 అని మాత్రమే వుంది.

ఆమె మరణించినా ఆమె సేవ చిరకాలం జీవించే వుంటుంది. మానవాళి దుఃఖాన్ని, బాధలను తగ్గించడానికి ఒక రంగంలో ఆమె చేసిన కృషి చరిత్రలోనే అపూర్వం.

ఆనాడు రవి అస్తమించని సామ్రాజ్యరాజధానియైన లండన్ నగరపు ముఖ్య కూడలిలో ఆమె విగ్రహానిన ప్రతిష్టించారు. నర్సు యూనిఫారమ్ ధరించిన స్త్రీమూర్తి ఒక చేతిలో లాంతరు పట్టుకొని నిలుచొని వుంది ఇప్పుడు కూడా అక్కడ. కొన్ని శతాబ్దాల పిమ్మట ఆమె విగ్రహము చెక్కుచెదరవచ్చునేమో! ఆమె పేరును గూడా మరచి పోవచ్చునేమో! కాని ఆమె వెలిగించిన సేవాదీపపు వెలుగురేఖల ప్రసారము మాత్రం ఎన్నెన్ని శతాబ్దాల పిదపకూడా ఆగదుకదా!

''నీ ఆవయానికి నీవు కట్టుబడి వుండు. కృషి చెయ్యి.

లోకులు ఎవరేమనుకున్నా లెఖ్ఖచేయకు, కృషిని కొనసాగించు''
లోకమే నీ పాదాక్రాంత మవుతుంది''

-- స్వామి వివేకానంద.

## మేడమ్ క్యూరీ

మానవాళిని వేధిస్తున్న వ్యాధులలో క్యాన్సర్ ఒకటి. ధైర్యము, ఓర్పు, కల్పనాశక్తి మూర్తీభవించిన స్త్రీమూర్తి మేడమ్ క్యూరీ రేడియంను కనుగొనడంతో, ఆ చికిత్స ద్వారా కొన్ని వేల మంది క్యానర్ రోగమునుంచి విముక్తులయ్యారు. మరెందరో తమ జీవితకాలాన్ని పెంచుకోగలిగారు ఇంత గొప్ప శాస్త్రీయ పరిశోధన వెనక ఎంతకృషి జరిగిందో తెలుసుకుందాము.

పోలెండు దేశంలో 1867లో ఒక సామాన్య కుటుంబములో మన్యాస్కోటో టోస్కో అనే అమ్మాయి పుట్టింది. తండ్రి వార్సాలోని ఒక కాలేజీలో ప్రొఫెసరుగా పనిచేసేవాడు. ఆట పాటలతో పాటు చదువు సంధ్యల్లో గూడ చురుకుగా ఉండేది మన్యా. తండ్రి ద్వారా శాస్త్రీయవిజ్ఞాన బీజాలు ఆమెలో మొలకెత్తి పెరగసాగాయి. 16 ఏళ్ళ వయసులోనే ఆమె వ్రాసిన ఒక వ్యాసానికి బంగారు పతకం లభించింది.

కుటుంబ ఇబ్బందులు, తండ్రి కష్టాలు చూచి మన్యాతన 19వ ఏటనే ఒక ధనికుల ఇంట్లో ఉద్యోగంలో చేరింది. ఆ ఇంటిలోని పదేళ్ళ పిల్లలను సంరక్షిస్తూ, చదువుచెప్పడం ఆమెపని. రాత్రి సమయాలలోను, పిల్లలు నిద్రపోయేటపుడు ఆమె చదువుకునేది. ఆ ధనికుని కుమారుడు శలవులకు ఇంటికి వచ్చినప్పుడు మన్యాను చూశాడు. ఆమె గుణగణాలను గుర్తించి మెచ్చుకొని పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని ఒక పని పిల్ల తమ కోడలు కావడానికి ఆ ధనవంతులు అంగీకరించలేదు. ఈ అవమానంతో అక్కడ వుండలేకపోయింది. పెళ్ళి చేసుకోవాలనే ఆలోచనకు స్వస్తి చెప్పింది.

సైన్సు చదివి పరిశోధన చేయాలనుకుంది. కాని పురుషులు మాత్రమే శాస్త్ర అధ్యయనం చేస్తున్న రోజులవి. 1891 పారిస్ విద్యాలయంలో తన పేరు

నమోదు చేయించుకున్నది. తాను ఉద్యోగం చేసి దాచుకున్న కొద్దిడబ్బులో చాలా భాగం చార్జీలకే అయిపోగా మిగిలిన దాన్ని సర్ది వాడుకున్నది. ఎవరితోనూ చొరవగా వుండలేకపోయింది. వాళ్ళనాన్న తగినంత డబ్బు పంపలేక పోవడంతో నాలుగేళ్ళ పాటు నానాకష్టాలు పడింది.

గది అద్దె, తిండి, బట్టలు, చదువుఖర్చులుఅన్నీ కలసి రోజుకు మూడు షిల్లింగులలో ఇముడ్చుకున్నది. తన గదికి గ్యాసుగాని, కరెంటుగాని లేవు. చలికాచుకునే వీలుకూడా లేదు. మొత్తం చలికాలంలో రెండుబస్తాల బొగ్గు మాత్రం కొనుక్కొని దానినే పొదుపుగా వాడుకున్నది. చలికివణికే భుజాలతో కొంగర్లుపోతున్న చేతులతో లెక్కలు చేసుకొనేది. ఒక చౌకబారు సత్రంలో చివరి అంతస్తులోని ఆమె గదికి వెళ్లాలంటేనే, ఇరుకుమెట్లగుండ, ఇబ్బందిగా వెళ్ళాలి. చలికి ఆగలేక పెట్టిలోని బట్టలన్ని కప్పుకొని పడుకునేది ఒకోసారి కుర్చీ క్రింద కాళ్ళుముడుచుకొని పడుకునేది.

తనకున్న సరుకులే తక్కువ. వాటితోనైనా వంటచేసుకుంటే అలస్యం అవుతుందనుకునేది. వారాలతరబడి కొద్దిగా రొట్టి, వెన్న చల్లని తేనీరు త్రాగుతూ కాలం గడిపింది. కొందరు పిల్లలకు పాఠాలుచెప్పి కాస్త, డబ్బు సంపాదించుకున్నది. లేబరేటరీలో సీసాలను కడిగి మరికొంత దాచుకుంది తమ దగ్గర సీసాలు కడుగుతున్నది సాధారణ వ్యక్తికాదని ఆమె పనిని చూసిన ప్రొఫెసర్లు గ్రహించారు. రెండేళ్ళలో భౌతిక శాస్త్రంలో, మరొకొద్దికాలానికే గణితశాస్త్రంలో పట్టభద్రురాలయింది ఓటమిని అంగీకరించదని ధృఢ నిశ్చయం గల్గిన మహిళ మన్యా.

చదువుపట్ల చూసిన శ్రద్ధలో కొంచెమైనా ఆహారము విషయములో చూపలేదు. పేదరికం, పనివత్తిడివల్ల తిండి గురించి పట్టించుకొనేది గాదు. పచ్చికాయలు, ముల్లంగిదుంపలవంటివి తివి ఆకలిని తీర్చుకునేది. నీరసంతో ఒకసారి క్లాస్లో కళ్ళు తిరిగి పడిపోయింది కూడా.

విజ్ఞానసముపార్జనకై తపించేది ఆమె ఎంతటి చలిగాని ప్రతికూల వాతావరణంగాని, మరెంతటి ఆకలిగాని ఆమె జ్ఞానాగ్నిని చల్లర్చలేకపోయాయి. పారిస్ వచ్చాక పియరీక్యూరీ అనే శాస్త్రజ్ఞుడితో పరిచయమయింది. అతని ఆకర్షించింది. అది క్రమంగా పెరిగి, ప్రేమగా మారి 1895లో వారి పరిణయానికి దారి తీసింది. పీరీక్యూరీ, మేడమ్ క్యూరీ ఇరువురూ హేతువాదులు, మత నియమాలు పాటించకుండా సివిల్ పద్దతి ప్రకారం వివాహము చేసుకున్నారు. ఫ్రాన్సులోని దిట్టలైన శాస్త్రజ్ఞులలో ఆయ ఒకడు. అయినా ఆర్థికంగా ఆయన అంత గట్టివాడు కాదు పెళ్ళి నాటికి వాళ్ళ అస్థి అంతా కలసి రెండు సైకిళ్ళే. వాటిమీదనే హానీమూన్ కు పల్లెప్రాంతాలకు వెళ్లారు. పండ్లు, రొట్టెలు తింటూ ప్రకృతిదృశ్యాలను పరికిస్తూ, సత్రాలలో మకాంవుంటూ వివాహానంతర విహారయాత్రకు చేశారు. మన్యా అప్పటినుండి మేడమ్ క్యూరీగా మారింది. వారి జీవితము ప్రశాంతంగా సాగిపోతున్నది. కాని ఆర్దిక ఇబ్బందులులు తగ్గలేదు. ఆయన జీవితం తక్కువ అందులోనే వాళ్ళ ప్రయోగాలకు కొంత ఖర్చుచేయాల్సి వచ్చేది, ఇంట్లోపని, వంటపని మేడమ్ క్యూరీ చేసుకునేది. ఫ్రెంచిభాషలో శాస్త్రీయ వ్యాసాలను ప్రచురించి ఆమె కొంతడబ్బు సంపాదించేది.

మరో మూడేళ్ళు గడిచేసరికి మేడమ్ క్యూరీ డాక్టరేట్ కొరకు పరిశోధనలో నిమగ్నమయింది. అందుకై తాను ఏదైనా విశిష్ట పరిశీలన చేయాలి. యురేనియం ఖనిజము కాంతి కిరణాలను ప్రసరించడానికి కారణమేమిటో శాస్త్రజ్ఞులకు అంతుబట్టలేదు. దానిని తెలుసుకోవడానికి అన్వేషణ ఆరంభించింది. కొన్ని వందల రసాయనిక పదార్థాలను, ఖనిజాలను పరివీలించింది. ఏదో ఒక అదృశ్యమూలకం ద్వారా ఈ కిరణాలు వెడువడుతున్నాయిన తెలుసుకున్నది. భర్త కూడా తన పనిని ఆపుకొని ఆ మూలకమేదో కనుగొనాలని ఆమె పరిశోధనలో సాయపడ్డాడు.

ఈలోగా వారికి ఇద్దరు కలిగారు. వాళ్ళ సంరక్షణకు ఆయాను పెట్టుకునే స్థితిలేక తల్లియే వాళ్ళ ఆలనాపాలనా చూసుకునేది. తర్వాత ఫ్రాన్సులోని ఒక

ప్రసిద్ధ కళాశాలలో ఫిజిక్స్, కెమిస్ట్రీల ప్రొపెసరుగా ఉద్యోగంలో చేరింది. ఐనా తన ప్రయోగాలను మాత్రం ఆనకుండ కొనసాగించింది. వారాలు, నెలలు గడిచిపోతున్నాయి.

1895లో రోంటజన్ అనే శాస్త్రజ్ఞుడు ఎక్స్-కిరణాలను కనుగొన్నాడు. 1896లో ఫ్రెంచి శాస్త్రవేత్త హెన్రీ బెకరిల్ యురేనియం యొక్క రేడియోధార్మిక శక్తిని కనిపెట్టాడు. మామూలు కంటికి కనిపించని కిరణాలు కన్ని పదార్థాల గుండా చొచ్చుకుపోతాయని తేల్చారు. క్యూరీ దంపతులు ఈ క్రొత్త చర్యలపట్ల ఆసక్తితో పరిశోధనలు కొనసాగించారు. విభిన్న ఖనిజాలను ఎక్కువ మొత్తాలలో తెచ్చి విశ్లేషించారు. వీళ్ళకు ఖరీదైన పరికరాలు, చాలినంత డబ్బు లేకపోయినా బెండెడు పట్టుదలతో ముందుకు సాగారు.

వాళ్ళ ప్రయత్నాలు ఫలించాయి. శతాబ్దాల నుండి శాస్త్రజ్ఞుల విశ్వాసాలను వమ్ముజేసేవార్తను ప్రకటించారు. యురేనియం కంటే పదిలక్షల రెట్లు అధిక ధార్మికశక్తిగల లోహాన్ని ఆ దంపతులు కనుగొన్నాదరు. ఆ లోహపు కాంతి కిరణాలు కొయ్య, రాయి, ఉక్కు, రాగి ద్వారా కూడా ప్రసరించేటంత శక్తి గలవి. ఆ లోహమే రేడియమ్. వాళ్ళు కనుగొని సీసాలో వుంచిన కొంచెం లోహము నుండి కాంతి వంతమైన రేఖలు కనిపించాయి.

శాస్త్రజ్ఞులు ఈ మాటలను విశ్వసించలేదు, రేడియం మూలకానిన చూపెట్టమన్నారు. రేడియంను వేరుచేయడం చాలా కష్టమైన పని. అందుకై ఆ దంపతులు 1898 నుంచి నాలుగు సంవత్సరాల పాటు అవిశ్రాంతంగా కృషిచేశారు. అందుకు ఫలితంగా ఒక గ్రాములో పదోవంతు రేడియంను తయారుచేయగలిగాకె, స్కూల్ ఆఫ్ ఫిజిక్స్ ప్రాంగణంలోని ఒక పాడుబడిన షెడ్లో పాతస్టౌతో ఖనిజాన్ని కరిగించారు. ఆ నేలకు గచ్చేలేదు. పైక కప్పుగూడా సరిగ్గాలేదు. చలికాలంలోను, వేసవికాలంలోను ఆ గదికి లోపల వెలుపల వాతావరణంలో పెద్ద తేడా వుండేదికాదు. వంట చేసుకునే తీరిక లేక స్పిరిటు దీపం మీదనే ఏదో వండుకుని కాలక్షేపం చేశారు. ఒక రోజు రాత్రి ఇంటికి వచ్చి

పడుకున్నా నిద్రరాలేదు. ఆమెకు, భర్తను నిద్రలేపి ఇద్దరు కలసి షెడ్ వద్దకు వెళ్ళారు, ఈ చీకట్లో రేడియం వింతకాంతులను విరజిమ్ముతూ కనిపించింది. ఆ దృశ్యాన్ని ఆమె జీవితాంతమూ మరువలేదు.

ఒక చిన్న ధాన్యపు గింజంత రేడియంను తయారు చేయాలంటేపదిటన్నుల దాకా పిచ్ బ్లెండ్ అనే ముడి ఖనిజాన్ని కరిగించాలి. అందుకు నిర్ధుష్టత మాత్రమేకాక ఓర్పు కూడా కావాలి, ఖనిజము కూడా సులువుగా దొరికేది గాదు. ఆస్ట్రియానుంచి తెప్పించారు. అలా కరిగిటపుడు విషవాయువులు వెలువడుతాయి కూడా. ఆ రసాయనికి పొగవల్ల మేడమ్ క్యూరీ కళ్ళు దెబ్బ తిన్నాయి, గొంతు పోయింది. భర్తకు విసుగుపుట్టి కొంతకాలం ఆ ప్రయత్నాలాపుదామన్నాడు. కాని మేడమ్ వినలేదు. మరికొన్నాళ్ళు మరింత కృషిని కొనసాగించారు. విజయం వాళ్ళ కాళ్ళముందు వచ్చి వాలింది. లేదా వాళ్ళే ఉన్నత శిఖరాలకెగిరి విజయాన్నివరించాలరనుకోవచ్చు. 1898 జూలైలో క్రొత్తలోహాన్ని కనుగొన్నాడు.

అప్పట్లో ప్రపంచంలో విలువైన లోహము రేడియమ్. ఇది చాలా శక్తివంతమైనది. ఎక్కువ పరిమాణాల్లో ఉత్పత్తి చేయడము, నిల్వ చేయడమూ కష్టమే. ఏ ప్రేరణా లేకుండా నిరంతర కాంతిని, వేడిని, విద్యుత్తునూ వెలువరిస్తుంటుంది. దీనిని చాలా చిన్న మొత్తాలలోనే చూడగలం. పెద్ద మొత్తం దగ్గరకు వెళితే శరీరం కాలపోతుంది. దానిలోని అణువులలో నిక్షిప్తమైవున్న అనంతశక్తిని ఎన్నోవిధాల పయోగించుకోవచ్చు.

రేడియంను కనుగొనడంలో క్యూరీ దంపతుల పేరు ప్రఖ్యాతులు ప్రపంచానికి తెలిశాయి. 1902వ సంవత్సరము వారిక పరీక్షాకాలం. కొండంత డబ్బుకావాలో, నిస్వార్ధముగా శాస్త్రవిజ్ఞానానికి కట్టుబడి వుండాలో తేల్చుకోవలసినసమయం అది. రేడియం ద్వారా క్యాన్సర్కు చికిత్సచేయవచ్చునని తేలటంతో దానికి విపరీతమైన గిరాకీ ఏర్పడింది. కాని తయారు చేయడం ఎలాగో ఎవరికీ తెలియదు. క్యూరీ దంపతులు దానిని పెటెంటుచేసి ఎంత ధనాన్నైనా సంపాదించవచ్చు. ఆ డబ్బుతో తమ దారిద్ర్యం నుంచి విముక్తులయి తరతరాల

వరకు సుఖంగా జీవించవచ్చు. కాని ఆమె తన అద్భుత పరిశోధనకు ప్రతిఫలం ఆశించలేదు. ''ఎంతమాత్రమూ అవసరము లేదు, పరిశోధనా ఫలితాలను అమ్ముకోవడం శాస్త్రానికే విరుద్ధం. అందులోనూ పరిశోధనా ఫలితం ఒక భయంకర వ్యాధికి చికిత్సగా పయోపడుతుందని దాని నుంచి లాభం ఆశించలేను'' అని ఖండితంగా చెప్పింది. అంత త్యాగపూరిత నిర్ణయాన్ని ఏ కొద్దిమంది మహాత్ముల నుంచి మాత్రమే మనము ఆశించగలము.

1903లో ఆమెకు భర్తతో కలసి ''భౌతికశాస్త్రంలో నోబెలు పురస్కారం లభించింది. ఆమెకు మరెన్నో గౌరవాలు, సత్కారాలు, సన్మానాలు లభించాయి. ఆర్థికంగా కొంత నిలద్రొక్కుకున్నారు. అన్ని వసతులలో ఆధునిక లేబరేటరీని నెలకొల్పుకున్నారు.

కాని అందులో పనిచేసే అదృష్టం పియరీక్యూరీకి లేదు. 1906లో రోడ్డు ప్రమాదంలో ఆయన మరణించాడు. జీవిత భాగస్వామి, ప్రేమించి పెళ్ళిచేసుకున్నవాడు, వృత్తిలో చేదోడువాదోడు అయిన భర్త అకాల మరణం ఆమెను క్రుంగదీసింది. కాని కొద్దికాలంలోనే తెప్పరిల్లుకొని కార్యోన్ముఖురాలై తన కర్తవ్యం గుర్తుతెచ్చుకొని మరల నడుం బిగించింది.

ఆమెకు డాక్టరేట్ గౌరవం లభించింది. 1911లో రెండోసారి నోబెలు బహుమతి లభించింది. ఈ సారి రసాయన శాస్త్రంలో ఆమెకు ఈ సత్కారాన్ని ప్రకటించారు. భర్త మరణానంతరము మేడమ్ క్యూరీ శాస్త్ర పరిశోధన సాగించి, 16 బంగారు పతకాలు, 19 డిగ్రీలు, 88 గౌరవపురస్కారాలు పొందింది, అయినా ఆమె తన అధ్యయనాన్ని ఆపలేదు.

పారిస్ విశ్వవిద్యాలయంలో మొట్టమొదటిగా మహీళా ప్రొఫెసరుగా ఆమె నియమించబడింది. తరువాత కొద్దికాలానికి పారిస్ లోని రేడియం ఇన్ స్టిట్యూట్కు డైరెక్టరుగా నియమించబడింది.అక్కడ ఆమె వైద్యచికిత్సలో రేడియం ఎన్నెన్ని రీతులుగా ఉపయోగపడుతుందో పరిశీలించింది. ప్రమాదాలలో కోల్పోయిన రోగగ్రస్తమయిన శరీరభాగాలచికిత్సలో రేడియం వల్ల కలిగే మేలును గూర్చి

ప్రయోగాలు చూసింది. యుద్ధసమయంలో రెడ్ క్రాస్ సంస్థ ద్వారా, వారి సహాయంతో ఫ్రెంచివారికి రేడియంను మిలటరీ ఆసుపత్రులకు అందజేసింది. రేడియో యాక్టివిటీ 'రేడియో ధార్మికశక్తి' అనే పదాన్ని మొదటగా వాడింది ఆమె.

ఆమె పెద్దకుమార్తెకు 1935లో ఫిజిక్సులో నోబెల్ బహుమానం లభించింది.

ఒకనాటి పిరికి, బిడియక, పేదింటి అమ్మాయి శాస్త్రజ్ఞురాలయి అసాధ్యమనుకున్న దానిని సాధించింది. రెండు లక్షల పౌండ్ల ఖర్చుతో ఆమె జీవితాన్ని భారీ చలనచిత్రంగా తీశారు.

తరువాత ఆమె అమెరికాలో పర్యటించింది. అక్కడ ఘన స్వాగతాలు అందుకొంది. అమెరికనులు ఆమెకు ఒక గ్రాము రేడియంను బహుకరించారు. ఆనాడు దాని విలువ ఇరవై వేల పౌండ్లు. మేడమ్ క్యూరీకి తన 67వ ఏట రేడియేషన్ దుష్ఫలితమైన ఒకరకపు పాండు వ్యాధి వచ్చింది. ఆ అనారోగ్యంతో మరణించింది.

మానవాళి సుఖం కొరకు త్యాగాలు చేసిన ఈ స్త్రీ మూర్తి పేరు చరిత్రలో చిరకాలం నిలచివుంటుంది.

* * *

## హెలెన్ కీలర్

కాస్త ఆలోచించి చూస్తే మనిషికి ధృడసంకల్పం ఉంటే చేయలేనిదే లేదేమో అనిపిస్తుంది. ఇందు ఒక మంచి ఉదాహరణ హెలెన్ కీలర్ జీవితం.

కీలర్ అందమైన అమ్మాయి, ఆమె రెండోఏట జబ్బునపడింది. కొన్ని వారాలు చావుబ్రతుకులమధ్య పోరాడి చివరకు చెమిటి, గ్రుడ్డి అమ్మాయిగా బ్రతికి బయటపడింది. ఆ కూతురి అశక్తతలు చూసి ఆవేదన చెందినా తల్లిదండ్రులు ఏమీ చేయలేక నిరాశ చెందారు. అమ్మాయికి ఏడేళ్ళు వచ్చాయి.

బోస్టన్ లో అంధుల పాఠశాల వుంది. వాళ్ళు సలహా ఇచ్చి 'ఆనీ' అనే 21 ఏళ్ళ మహిళను ఆ అమ్మాయిని పెంచడానికి దాదిగా పంపారు. ఆనీ కూడా అవిటి మనిషే, ఆమెకు కంటిచూపు బాగా తక్కువ, ఈమె అనాధ శరణాలయాల్లో పెరిగింది. ఆనీ ఆరేళ్ళలో అంధుల పాఠశాలలో చదువు పూర్తిచేసి పట్టభద్రురాలయింది. రెండుసార్లు ఆపరేషను చేస్తే చూపు చాలావరకు వచ్చింది.

ఆమె కీలర్ కు చదువుకూడా చెప్పాలనుకుంది. కాని మొదటి నాలుగైదు వారాలు చాలా కష్టపడింది. చెప్పడానికి వినపడదు, చూపంచడానికి కనబడదు. ఎలా చెప్పాలో తోచేదికాదు, పైగా ఆ అమ్మాయి ఎప్పుడూ ఏడుస్తూ తప్పేది, కోరికేది కూడా. ఆనీ ఓపికగా పాఠాలు మొదలు పెట్టింది. బయట ప్రపంచాన్నిపరిచయం చేయసాగింది. నీళ్ళలో చేతులు ముంచి 'నీళ్ళు' అని అంధుల లిపిలో వ్రాసిచూపేది. కొద్దికాలంలోనే మాటలన్నీ చాలా చురుగ్గా నేర్చుకోగలిగింది. ఇంగ్లీషు, లాటిను, ఫ్రెంచి, జర్మన్ భాషలను బ్రైలీలో చదవగల్గుతుంది. పది ఏళ్ళప్పుడు మాట్లాడడం ప్రారంభించింది. మొదటిసారిగా ''నేను మూగదాన్ని కాదు'' అన్న మాటలకు అస్పష్టంగా అన్నది.

ఇరవయ్యో ఏట కాలేజీలో చేరింది నాలుగేళ్ళలో బి.ఏ., పూర్తిచేసింది. క్లాసులో చూపు, వినికిడి ఉన్న వాళ్ళ కంటే ముందుంటేది. 'ఆశావాదం' 'నాజీవితం'నేను నివసించే ప్రపంచం వగైరా పుస్తకాలను వ్రాసింది. అవి విపరీతంగాఅమ్ముడుపోయాయి. పత్రికా రచన ప్రారంభించింది, తరువాత తన

పంతులమ్మతో కలసి ప్రపంచమంతటా విస్తృతంగా పర్యటిస్తూ ఎందరో ప్రముఖులను కలుసుకొన్నది. అంధులకు సేవ చేసింది. ఇతరులు మాట్లాడే సమయంలో ఆమె సున్నితమైన వ్రేళ్ళను వారి కంఠంపైన ఆనించి మాట్లాడే విషయాన్ని గ్రహించేది. ఆమె అనేది 'తనకు సంపద ఉన్నపుడు మనిషికి దాని విలువ తెలియదు. కండ్లు పోయాక చూపు విలువ తలుసుకుంటాడు' అని. ఉన్న శక్తిని సరిగ్గా వినియోగించుకోవాలటుంటుంది. ఆమె ఇలా ఇన్ని అవిటితనాలున్నా ఒకరికి బరువుగాకుండా తానే ఇతరులకు సహాయం చెయ్యగల స్థాయికి పెరిగింది హెల్లెన్ కీలర్. 1968 వరకు జీవించి ఈమె.

ఇంతకంటే ప్రత్యక్ష సాక్ష్యం ఏది కావాలి, 'బలమైన కొర్కె వుంటే చేయలేని దేదీలేదు' అని చెప్పడానికి.

* * *